# ప్రమోదము

చరాచరవిశ్వమున కంతకు ఆధారభూతుఁ డొక్కఁడే. వివిధ అవస్థలతో, గుణములతో కాలచక్రము భ్రమించుచుం డును. ఇందుకు లోకము సదా బద్ధమైయుండును. గుణములు మూఁడయ్యెను వానినుండి అనంతగుణము లావిర్భవించి నవి. గుణములనుండియే అవస్థ లేర్పడినవి. ఇట్టి యవస్థలకు భోక్తలు జీవులు. పరమాత్మ యొక్కఁడేయయ్యెను సృష్టి నిమిత్తముగా జీవులకొఱకు బహురూపు డయ్యెను. కాగా ఈ చరాచరప్రపంచ మంతయు పరమాత్మస్వరూపమే. ఈ సృష్టియు, ఈ ప్రపంచము అతని లీలయె.

బహురూపుఁడైన భగవంతుడు భక్తులకు బహువిధము లుగా భాసించుచు, భక్తుల కోర్కెలను నెరవేర్చుచున్నాడు. బహురూపములైన భగవత్స్వరూపములలో భాస్కరునిది ప్రత్యక్షస్వరూపము. "ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్" ఈ యారోగ్యము జీవితమున ప్రతిప్రాణికి పరమావశ్యకము. "శరీరమాద్యం ఖలు ధర్మసాధనం" అనిరి. సర్వ ధర్మాచర ణమునకు ఆధారభూతము శరీరముకదా! అట్టి శరీరధారణకు ఆరాధ్యదైవతము సూర్యభగవానుడు. ఇతడు ప్రత్యక్ష దైవము. భూమికి కొన్నివేలమైళ్ళదూరమున నుండియు సర్వ లోక సాక్షియై తన దివ్యకరములచే సర్వప్రాణులకు జీవన దానము చేయుచున్నాడు. ఈ దైవము కాన్పించని దినము దుర్దినము.

సూర్యోపాసన ప్రత్యక్షఫలప్రదము. సూర్యోపాసనకు ముఖ్యమైనది మహాసౌరము. ఇది మంత్రమూలము. ఇట్టి

వేదమంత్రము సుస్వరముగా నందరు నుచ్చరించుటకు వలను పడదు. అట్టి మంత్రప్రతిపాదితార్థమును సుగమమొనర్చుచు మంజులమైనభాషలో పద్యములుగా కూర్చి, అందర కందు బాటులో నుండునటుల గావించిన శ్రీ శ్రీయానందనాథులు బ్రహ్మశ్రీ ఈశ్వర సత్యనారాయణశర్మగారు వందనీయులు. ఏయే కోరికల కేయేపద్యములు పఠించవలయునో సూచింప బడి యున్నవి.

భక్తులు, శ్రీ శ్రీయానందనాథులవారి యంతేవాసులు నగు శ్రీ ఎం. వి. నరసింహారావుగారు వారి యర్థాంగియగు కమలాసంస్మరణముతో కమలా స్మృతిచిహ్నముగా నీ గ్రంథమును ప్రకాశింపజేసి పాఠకలోకమున కందించుట ముదావహము. ఇందుమూలమున శ్రీ నరసింహారావుగారి సంకల్ప సూర్యభగవానుడు సిద్ధింపజేయుగాక.

పితృపాదులు, పూజ్యులు అగు బ్రహ్మశ్రీ ఈశ్వర సత్యనారాయణశర్మగారి ఆదరాభిమానములచేతను, శ్రీ యం. వి. నరసింహారావుగారి సంపూర్ణ ఆర్థికసహాయము చేతను మా మండలిలో నీ గ్రంథమును ప్రకటించుచున్నందులకు వారికి కృతజ్ఞుడను.

| | |
|---|---|
| వికారి<br>భాద్రపదము | బులుసు సూర్యప్రకాశశాస్త్రి<br>సంపాదకుడు : సాధన గ్రంథ మండలి. |

—*—



ఆంధ్రపద్యానువక్త:

శ్రీ శ్రీయానందనాథుఁడు

ఈశ్వర సత్యనారాయణ శర్మ

# ఛాత్రానందనము

నాయనా ! నరసింహారాయా !

నీ ధీరత యూడలు తన్నిన మట్టిపాటిది. దేహాత్మ బోధరూప గజవిదారణ తేజశ్శాలి వీవు. సార్థకనరసింహుఁడ వని నా సంతసము. శ్రీ మాతృశక్తి పరిచాలన సమర్థవాహన మవు. అసురసంఘ విశసనమం దమ్మకు బాసటయాదు వీవు. నీకు సింహధర్మమును బట్టించునది నీ కమల.

నీ కమల పార్థివభోగవర్ధని యగుటను గమల, ఆధ్యాత్మికానంద సంధాయిని (కం=ఆత్మానం, అలతి=భూషయతీతి) యగుటనుం గమల; కమల బంధుమ:డలద్వారమున నిర్నిరోధముగఁ జొచ్చి దానిఁ గైసేసినది (కం = సూర్యం, అలతి = భూషయతీతి) నీ కమల.

కమలను గమలనుగాఁ బ్రేమించితివి, పూజించితివి; ఇపుడును గమలనుగానే స్మరింపుము.

కమల మిత్రారాధనమునకు నినుఁ బ్రేరేచి, నన్ను నిమిత్తముగాఁజేసి యుందు నీ వుత్తీర్ణుఁడవుకా నూఁత యగుటే కాక, నీ మిత్రులను గొందఱను గమలమిత్ర మిత్రులనుగా నీచేఁ జేయించినది నీ కమల.

నిత్యమందహాసామలము నీ కమలానన కమలము. గల త్కారుణ్య మకరంద పృషతము నీ కమల వదనకమలము. ఆశ్రితామోదప్రసరము నీ కమల ముఖకమలము. సదానంద కమల సిరాడంబర విహార, నీ కమల నిగూఢ సుజ్ఞానసార, శ్రీ గురుపాదకమల సద్మము నీ కమల మనఃపద్మము. సతత కమలాలయా పూజనపూతము నీ కమల కరకమలజాతము. సంతత పతిముఖ కంజాతోదిత కమలాస్తుతి నాదపూర్ణము నీ కమలకర్ణము, సకలసౌహార్దవిమల నీ కమల. స్వవియోగ

ముకుళీభూత సరోజ నీ కమల నిజాశ్రిత కల్పభూజ. ఇది వాస్తవములో స్తవములో వస్తువే ప్రమాణము.

శ్రీ పర్యాయగేయ కమలానిర్యాణమున నిపుడు, గురు శ్రీ శ్రీయానందుని ముఖకమలము సుఖామలమా? ఔను. నిజావతార లక్ష్యము నిర్మలతా పర్యాప్తము. సౌరమండలాంతర్వర్తి సత్యనారాయణుఁడు, కీర్తనీయ కార్తికమున స్వప్రియంకరై కాదశీతిథిని, స్థిరదినమున పూతజీవప్రాణమును దన మహాప్రాణమందుఁ జేర్చికొనుటకే, లెస్స చాచియుంచి స్వమనూపాసనాప్రయతహృదయుఁడైన దయితుని చే నందీయఁబడిన కమల నందుకొని యంకమునఁ జోటిచ్చి శ్రీ శ్రీయానందుఁడై సుఖామలుఁడే యూ లోకగురుఁడు.

ఇచ్చినవాఁడు కమలాప్తుఁడు, పుచ్చుకొన్నవాఁడు కపులాప్తుఁడు అమ్మా! కమలా! నీ వక్కడనుండియే వినుము, కాదు కాదు; పొరపాటు - ఇక్కడనే యున్నావు; విను. నీ పరమాప్తుని నిరతానందను నీకు మూలమైన మహా సౌరమంత్ర పాఠమును భాషాద్వయానువాదముతోఁ బునర్ముద్రితము చేయించి భక్తకరముల కందిచ్చి మహదాశీఃపాత్రుఁడుగాఁ బ్రోత్సహించితివా! సెబాస్! భౌతిక సంబంధమును వీడియు నాధ్యాత్మిక సౌభాగ్యసిద్ధి కండగానున్న నీవే ఛాయా సవర్ణా సదృశ సాధ్వీమణివి. నీ జీవిత పవిత్రత నెఱింగిన యెల్లరకును నీవు శ్లాఘ్యవే. వంద్యవే.

తల్లీ! పునరావృత్తిలేని పూమధామమున శశ్వచ్ఛాంతితో మాకెల్లరకు నిత్యస్మర్తవ్యవుగా నుండుము.

ఇట్లు

ఛాత్ర నిరతానంద చింతకుఁడు

శ్రీ శ్రీయానందనాథుఁడు



శ్రీ మట్టిపాటి వెంకట నరసింహారావు గారి సతీమణి

కీ. శే. కమలాంబ

శ్రీమాత్రే నమః

# కమలాస్మరణము - అంతఃశ్రవణము

ప్రాణబంధుఁడా! హితుఁడా! కలఁత నదకుము. ధైర్యముఁ జిక్కఁబట్టుము. నిర్వికారుఁడవై నీవు నీవుగానె యుండుము. త్యాగమూర్తి వగుము. నీ యాదర్శ సుందర జీవితపథ పదవిన్యాసము విశ్వజన శ్లాఘ్యమై యస్ఖలితమై సాగుఁగాక.

ఘనాఘన చంచలా లతికలవోలె నస్థిరము లీ జీవిత భోగములు. గిరినదీవేగోపమ మీ జవ్వనము. పుట్టుసావుల ఘాతప్రతిఘాతములు లేని సాధనమును శ్రీ శ్రీయానందగురు పదకమలముల నాశ్రయించి పడయుమని యుద్బోధించిన విజ్ఞానఖని కమల.

ఘోర మాయాజాలసంకీర్ణ మీ దృశ్యము క్షణస్థాయి. నదీప్రవాహ యాత్రయందు సంయోగవియోగ వశమై పోవు కాష్ఠఖండచయ మీ బాంధవశ్రేణి. భవబంధవిచ్ఛేదన దక్ష శీలసంపత్తి నిన్నత్తుకొనియుండుఁగాక, యని ప్రబోధించి యాధ్యాత్మికజీవితరంగ పదన్యాసమునకుం ద్వారపెట్టిన దివ్య మూర్తి కమల.

అది సం. 1941 మే నెల 31 వ తేది. కారుమొయిళ్లు నిండి నిబిడీకృతమై హృదయాకాశమును దుస్తమోబంధుర మొనర్చినవి. తుచ్ఛవిషయ సుఖలంపటుఁడనై, స్వేచ్ఛాభంగకము, స్వార్థప్రపూర్ణము, దుర్గంధభూయిష్ఠము, కలుషనిలయమునైన సంసారకారానుసంబద్ధుఁడనై, వెలుఁగుఁ గానక తట్టుమట్టాడించిన విషఘుటిక లవి.

మోహ మదిరాపానమునఁ గలుషితమైన స్వభావ కుటిలహృదయమునఁ బైశాచికనృత్యము సాగిన భయానక కాల ఘట్ట మది.

కాలపురుషుని తీవ్రకుఠారధారల కెరయై నా కుటుంబో ద్యానలతలు భిన్నభిన్నములై చెల్లాచెదరైన ప్రలయసంఘటన వేళ యది.

కింక ర్తవ్యతా విమూఢుఁడనై, యాశానిరాశాందోళి తుఁడనై, శాంతిలేక, తెన్నుదొరకక, అమ్మా! అమ్మా! యని యాక్రోశించు విపద్విషమపరిస్థితియందు, స్వీయ ప్రశాన్త వినిర్మల ధీర మందహాసరోచిస్సులఁ బఱపి, యజ్ఞానాంధకార మును దొలఁచి, భవిష్యజ్జీవితము నుజ్జ్వలతరముగాఁ దీర్చిదిద్దిన శ్రీదేవి ప్రవిమూర్తి కమల.

పదునేడేండ్ల యార్మాసములు జీవితనౌక నొడిదుడు కులు తలక్రిందు సేయకుండ నడిపించి, యిఁక నీనౌకకుఁ గర్ణ ధారిణి సర్వకారణభూత శ్రీమాత, యని యొప్పగించి, సం. 1958 డిసెంబర్ 6 వ తేదీకి సరియగు విళంబినామ సం॥ కార్తిక కృష్ణైకాదశీ స్థిరవాసరమున, వరుణకిరణుని నిశిత మయూఖశ్రేణిలో లీనయై, సూర్యా హిరణ్మయీ శ్రీమాత్రంక మున స్థిరనివాసమునకై యాహూతయై, యనాయాసయాత్ర సాగించినది నా కమల. అపాయమునాఁటి కామె ప్రాయము ముప్పదిమూఁడు హాయనములు.

ఆ తేజోమూర్తికి నేనేమి ప్రత్యుపకృతి చేసితిని? సహచరుఁడనై కష్టేష్టములను నావిగా భావించితిని. ఆమె

నిస్సహాయ దుర్బలస్థితిలో నిష్కపట సేవ చేసితిని. ఆమె నైతికధర్మ జీవన తత్పరతను, నా విశ్వాసమయ జీవితమును దోహదవస్తువు నొనర్చితిని. చెమట యూడ్చి, ఋజువర్తన మున గడించి. ప్రశాన్త సౌఖ్యమయ జీవితపథానువర్తినిగాఁ జేసితిని. ఆమె యాత్మగౌరవమునకును, సంఘోన్నతస్థితికిని నా సర్వస్వమును బలిదాన మొనర్చితిని.

కాలచక్ర సునిశితదంష్ట్రాన్తరముల నిఱుకుకొని, యాత్మ నాశమునకు గుఱికాకుండఁ గాపాడిన ప్రేమమూర్తికి, దయార్ద్ర చిత్త కిది ప్రత్యుపకృతియా? కాదు. సాధనాంతరము కానరాదు.

మా కమల దివ్యప్రేరణము.

పూజ్యపాదులు, గురుదేవులు, శ్రీ శ్రియానందనాథులు తమ పదునేనవయేఁట నొక పరమహంసచేఁ బ్రసాదింపఁబడిన సౌరమంత్రోపాసనము (ఈ గ్రంథమందు "వెలుఁగుల కుప్ప గొప్పను జెప్ప నుద్ది" చూడుడు.) "సూర్యాం హిరణ్మయీం లక్ష్మీం" అనెడి శ్రీవిద్యోపాసనముగా భాసించినది. అది లోకకల్యాణమునకై నది. శ్రీవారి శతసంఖ్యాక శిష్యబృంద పట్టికయందు మేమును గలము. శ్రీవారివలన సౌరమంత్రోప దేశము నే తొలుదొల్త నంది, గురుపదకంజసేవచే నపగత పాపులమైతిమి. ఆ వెలుఁగున మా కమల మున్నగా సంసరణ శరధి పారముం జేరిపోయినది.

శ్రీ గురుదేవులు మహాసౌరమంత్రపాఠమునకుఁ జేసిన యాంధ్రపద్యానువాదమును నా సతీర్థులు, హైదరాబాద్ వాస్తవ్యులు శ్రీ మల్లాపురం పుట్టు రామశర్మగారి యాంగ్లాను

వాదములోఁ బునస్సమ్ముద్రితముఁ జేయించి "ఏతత్సూర్యస్య సూర్యత్వం" అను మాటను భక్తలోకముచే మఱియొకసారి యాలోకింపఁజేసి లోకబాంధవుని కృపాలోకమునే యభిలషించుచుండుమనుటయు మా కమల విమలప్రేరణమే.

కమల బంధుని దివ్యదీధితులు విశ్వవ్యాపకములై యజ్ఞానాంధకార విదారకములై, వివేకోదయ ప్రభాప్రసార మగుచుండుదాఁక, భానుకిరణ విలీనమైన కమల యాత్మజ్యోతి యచటను — ఆమె ప్రేరణమున వెలువడిన యీ చిన్నికృతి యిచటను — వెలయుఁగాక.

ఇదె ధామనిధిమహిమ ప్రకాశకమైన యీ కృతియే ప్రేమనిధియైన కమల స్మారకచిహ్నమై మీ కరముల నలంకరించినది గాన, పాఠకసోదరులారా! మే మపేక్షించు ప్రతిఫలము మీ యాశీర్వాదమే.

బెంగుళూరు
21—7—1959

ఇటులు,
మఱ్ఱిపాటి వెంకటనరసింహారావు





# అంకితము

## అరసవల్లి శ్రీ సూర్యనారాయణస్వామి

శ్లో॥ హర్షవల్లీ పురీవాసం। ఛాయోషా పద్మినీయుతం।
సర్వదేవ నుతంనౌమి। భాస్కరం మంగళాకరమ్॥

శ్రీ మాత్రే నమః

శ్రీ సూర్యనారాయణ పరబ్రహ్మణేనమః

శ్లో॥ అంగీకృత మద్రాంధ్రీకృతకృతిః సుకృతీ రవిః
తుష్టోఽభీష్టార్థదో భూయాదస్మాభ్యమసే శ్రేయసే సదా॥ 1

శ్లో॥ మంత్రైః సమం మదంధ్రానువచనం ఫలదం భవేత్
ఉల్లంఘితం న భాష్యార్థం విద్యారణ్యకృతః యతః॥ 2

శ్లో॥ అనేక శ్లోకహీనాసు గ్రహామృత లిఖామయా
నిర్వర్తితోఽయం సందర్భః సర్వశ్రేయోర్థినాధునా॥ 3

శ్లో॥ హారీతేస సగోత్రోఽహమిాశ్వరాన్వయసంభవః
సత్యనారాయణాఖ్యః శ్రీ శ్రీయానందాపరాభిధః॥ 4

శ్లో॥ అర్సవల్ల్యాం (హర్షవల్ల్యాం) విగ్రహాత్మా పరమాత్మా
గ్రహాధిపః జయతాత్వారాధకారోగ్యదానే సుధృతకంకణః॥



గీ॥ ఏడు తేజుల తేరెక్కువాఁడ! చాయ
తేఁడ! యీరాజు మేనుల ప్రోడ! గాము
తేఁడ! నెలజోడ! మువ్వన్నెకాఁడ! తొగల
సూఁడ! బత్తులఁ జల్లగఁజూచువాఁడ!

సీ॥ ఎవని యుపాసనంబు వడుగు పోఁచతో
జాగ్రత్త యనుచు నాజనకుఁడిచ్చె,
ఎవని పావన పాద భువన సంసేవయే
మా తల్లి మెయి హారిమాణమడఁచె
ఎవఁడు చేసిన మేళ్ళ కింత విస్మృతి రాని
యట్లాత్మజునకుఁ దదాఖ్యనిడితి;
ఎవని స్తోత్రములు మంత్రదేవాసురులఁ బ్రోలి
సత్పదార్థజ్ఞాన సరణిఁజూపు;

అట్టి శ్రీ సూర్యదేవున కరసవెల్లి
వాసునకు, దాసదోషనిరాసునకు, ఘ
తాఘునకును విరోధ్యబ్దమాఘమందు
నంకిత మొనర్చితి నతిసహస్రయుక్తి.

సీ॥ త్రైలోక్యపూజ్యమై, త్రయ్యంతవేద్యమై,
త్రైగుణ్యరూపమై తనరునేది,
నిత్యమై, విప్రసంస్తుత్యమై, సువిచిత్ర
కృత్యమై, కడుం దులకించునేది,
అక్షరంబై, దాసరక్షకంబై, సర్వ
సాక్షికంబై జగచ్చక్షువేది,
తారకంబై, రోగదారకంబై, తమో
వారకంబై చు నివ్వటిలునేది,
యట్టి భాస్కరబింబమే యాకృతియగు
గ్రహమవై యర్నవల్లి విగ్రహమవగుచుఁ
దనరు బ్రహ్మస్వరూప! శాన్త్రితాప!
సూర్యనారాయణా! నీకు జోతలివిగో.

చ॥ తొలితొలిపల్కు నిన్ బొగడఁ దూకొను మంత్రము లర్వ దెదునున్
దెలుఁగునఁ జిన్నిపద్దెలుగఁ దీర్చి యొసంగెద నందుకొమ్మ; శ్రో
స్నేల యొక నూలిపోఁగునను, నీవొక మ్రొక్కన సంతసింతు; వి
ట్లలుపముతోనె తన్పిఁగొను నయ్యలు మీరలు కారె? భాస్కరా!

గీ॥ నీవు గంపంత కంటితో నిఖిలసాక్షి
వైన యున్నాళ్ళు నీకృతి యడరుఁగాక;
కృతిఁ బఠించెడివారికి క్షితిఁ జిరాయు
రరుజలుం, దుది సద్గతు లబ్బుఁగాక.

— శ్రీ శ్రీయానందనాథుఁడు

# చదువరులకు మనవి

ప్రత్యక్షదైవమై స్థితి ప్రధాన హేతుభూతుఁడైన మహిమాన్వితుఁడు సూర్యుఁడు వేద ప్రశస్తుఁడు. ఆ దేవుని యుపాసనము భరత ఖండమునఁ జిరవ్యాప్తిఁ గాంచినది. "ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్" అను నార్యోక్తి నేటి సౌర కిరణ చికిత్సా విధాన వ్యాప్తిచే నాధునిక నాగరకులకును విశ్వసనీయమైనదనుట శ్లాఘింగదా.

అది సౌరమంత్రోపాసనము తోడిదైనపుడు బహు ఫలప్రదమనుట నిర్వివాదము. ఈ యుపదేశము నాధారము చేసికొనియే యాస్తిక శిష్టులు సూర్యాభిముఖులై నమస్కారములు, ఉపస్థానము, జపము, స్తుతి చేయుచుఁ దత్ఫలమును దప్ప కందుకొనుచున్నారు. అట్టి యుపాసన మీ ఋగ్వేదీయ మంత్రములతోఁ జేయుట ప్రశస్తమని యనుభవమునఁ బండితులు చెప్పినది.

ఇందలి 11, 12, 13 మంత్రములతోనే సూర్య నమస్కారరూపోపాసనము నాచరణమున వెలయించిరి. బహిరంతర వ్యాధి నిర్మూలన సమర్థము లివియే.

నేనీ గ్రంథమును గురువులవలనఁ గఱచి నిత్యపారాయణమునం దుంచుకొనుట యెఱింగిన నా మిత్రులు కొందఱు వాని యర్థమును వివరింపఁగోరఁగా శ్రీ విద్యారణ్య భాష్యమును జదివి తోఁచినంతగా సమన్వయము చేసికొంటిని. మఱి యీ మంత్రములకుఁ దెనుఁగు పద్యములు వ్రాయు నుత్కంఠయు సర్వప్రేరకుఁడైన వాని ప్రేరణమే.

ఈకృతి సౌరమంత్రార్థమెట్లుఁగఁగోరి భాష్య పంక్తులను సమన్వయము చేసికొనలేని వారలకు ఉపయోగపడకుండదు. ఏ భాషయందలి గ్రంథమైనను జదువు వేళ నాంధ్రున కర్థమగుట యాంధ్రమందే కదా! కావున సర్వులకు సౌర మహిమమును సౌర మంత్రముతోనే కొనియాడి తత్కృప నార్జింప లేనివారలీ తెనుఁగు పద్యములను నిత్యపారాయణ మందుంచికొన్నను సుఫల మొందఁగలరని నా విశ్వాసము.

సౌరమంత్ర జపక్రమము, నమస్కారవిధానము మున్నగునవి యుపదేశపూర్వకముగా సద్గురువులవలన గ్రహించునది.

నేను వైద్యుఁడనయ్యు నసాధ్యవ్యాధులతో నాసాయమునకై వచ్చు రోగుల కెందఱికో సౌర మంత్రోపదేశమీయఁగా వారలు సుఖించిరనుట నా గొప్ప చెప్పుకొనఁ గాదు. త్రయీమయుండగు నద్దేవుని గొప్ప చెప్పుటకే యని భక్తు లెఱుంగుదురు గాక. ఈ విషయమున నింతకంటె వ్రాయను.

మంత్ర మంత్రార్థములు అనధికారి చక్షుష్కర ముఖగతములయి దోషాపాదకములు కావా యని కొందఱడుగ వచ్చును. అటయినచో వేదవేదాన్తాదులకు భాష్యములే పుట్టక పోవును. ఉపనిషత్సారము గీతా శ్లోక రూపమునే యందియుండకపోవును. ఇంతేల, లోకానుగ్రహ బుద్ధితోఁ బూర్వులు మండలస్తుతి మున్నగునవి రచించి "పునాతు మాంతత్సవితుర్వరేణ్యం" అను మాటలనే మకుటముగాఁ బెట్టి లోకమున కిచ్చిరి. అధ్యయనానర్హులయిన వారి కిమ్మంత్రములు సస్వరముగా నుపదేశించు టపచార మగునే

కాని, శుశ్రూషాపరులగు భక్తులకుఁ బద్యగద్యరూపమునఁ దదర్థ బోధనము సేయుట తప్పు కాదని నా నమ్మిక.

ఇందు స్తుతిమంత్రరూపమున రోగహరములు, శత్రుధ్వంసకములు, దృష్టిప్రదములు, ధనప్రదములు, ప్రజాప్రదములు, జ్ఞానప్రదములు, దుస్స్వప్ననివారకములు, అన్నదములు, ముక్తిదములు, పాపహారకములు ఆయుష్కరములునగు మంత్రములున్నవి. వానిని సౌరమంత్రములతోఁ జేర్చి యుపాసించుట మహత్తరఫలప్రదము. అనధికారుల భక్తితీవ్రతనుబట్టి తదర్థ బోధకములగు నీ తెనుఁగు పద్యములతోడి స్తుతియు ఫలప్రదమేయని మనవి చేయుచున్నాను.

మరియు నా యాంధ్రానువాదమునకు అభిప్రాయముల నిచ్చిన శ్రీ పారనంది సర్వేశ్వరశాస్త్రిగారికి నమస్కారములు, శ్రీ ఇప్పిలి వేంకటరామశర్మకు ఆశీర్వచనములు చేయుచుంటిని. వీరి యభిప్రాయములు తొలికూర్పున ముద్రించితిని.

ఆంధ్రీకరణమున నా స్ఖాలిత్యములను జూపు పండితులను మహోపకారులని మ్రొక్కి ముందుకూర్పున సవరించుకొందును.

ఇట్లు
పండిత విధేయుఁడు

శ్రీ శర్మద వైద్యశాల
శ్రీకాకుళము

ఈశ్వర సత్యనారాయణశర్మ
దీక్షానామము: శ్రీ శివానందనాథుఁడు

# వెలుఁగులకుప్ప గొప్పఁ జెప్పు నొక జరిగిన మాట

నా తండ్రి చదువరి, వెజ్జుమిన్న. మాకుం దరములబడిని సొమ్మయిన మనికిమినుకు తెలివి నాకును గలిగింప నెంచి, వేలుపు బాస పట్టులేకది యబ్బదని పెద్దబడిలోఁ దెల్లదొరబాస కఱచు నపుడే వేఱుగా నాకు వేలుపునుడియు మప్పించెను. 1904 లోఁ బెద్దతరగతిం జదువునప్పటికే కాళిదాసుని మూఁడు కబ్బములు ముఁగిసినవి. పిమ్మట నా తెల్లదొర బాస కారతి యిచ్చి వేలుపునుడి కఱపు తోఁడగా సాగించితిని. ఇటు నాన్నతో మనికిమినుకు గఱవ మొదలిడితిని. అటు పెద మొగమగుటను నిటు తొలునకును జిననాఁడు నా పదియవయేఁట నొక చందమామ పట్టు పబ్బమున నాన్న నా చెవినిడిన దక్కినపు మోము వేలుపు మంతరపు బలిమియే కతము.

నా పదునేనేండ్ల పాయమున నొక ముచ్చట ఎక్కడి నుండియో వచ్చిన యొక యొంటికాఁడు, నలు నెలల బతము నకు మా యూరఁ జిక్కెను. గేస్తులు బోడలయెడ బత్తిచూపి బిచ్చపెట్టునాళ్ళవి. అటువచ్చిన సన్నాసిని జాగుబడి మున్నుగాఁ గొనివచ్చి మా యయ్య సాపడఁజేసెను.

రేపటికిం బ్రొద్దుదేవర పొద్దు. మా శ్రీకాకుళము చేరువ నొక కోసు దవ్వులోపలనే "అరసవల్లి" యను పల్లె గల దండుఁ జాయమగని గుడి 1400 యేండ్ల వెనుకటికే వాసి గొన్నది యున్నది. ఆ వేలుపుం గొలుచు వేడుకతో నా బోడ నా తోడు కోరెను. నేనును నీకొని యా యొంటికాని వెంట నేగితిని. ఇరువురము గుడికేగి వేడి వెలుఁగు వేలుపుం గొలిచితిమి.

ఇంటికి మఱలుచు నత్తబిసి యేమనుకొనెనో, అబ్బీ! పోదము గాని, యిటు రా! యని, మఱలఁ గొలఁకునకుఁ గొనిపోయి మఱొక్కసారి మునిఁగి రమ్మనఁగా నటు చేసితిని. చేరఁదీసి తలఁపు నుదులు పల్కించి, నా రెండు చేతులం దన యడుగులనుఁ దన కుడిచేయి నా నడునెత్తి నత్తించి, నెనరు జూపొక కొన్ని తెప్పపాటుల తడవు నా మోమునఁ బఱఁగించి, పవటిజేని పదివిత్తుల మాంతరమును నా కుడిచెవిం బడవైచి యా యఱాఁపున నూటెన్మిదిపఱులు పలికించి, యిది నిన్నెల్ల తెఱఁగుల గాచుఁజుమా! మనుగడ తుదిదనుక మానకుమా! యని దాని కందువం దెలిపి మఱలించెను. ఇలు సేరి నాన్నగారి కిమ్మాట సెప్పి తనియించితిని.

ఇరువది పంటల యీషురా, నొక తీరు మ దరినైతిని. ఆనాటి యుబుసే యిది. మా యమ్మ గట్టి మేకలిమి గలది. ఒకనాఁ డుంబులకరస్సు నెఱుఁగదు. అఱః మెట్టిదో యెఱుఁగదు. సిరి చాఁగుబడి మఱువదు క్రొత్తడి తలపూవు. అట్టి యామె మేనెల్లఁ దెల్లని యానుగ పూవులఁబోలు మచ్చ లొక్కమ్మడిగా నల్లుకొనెను. నాయనగారు కన్నీరు నించుచు “అబ్బాయీ! మీ యమ్మ మేని పొడలఁ జూచితివా? ఇరు వంగడముల లేని యీ కాఁటతెవులునకుఁ గతమారయ లేనైతిని. దీనికి బదులు సేఁతయారయ కొప్పరికించుట తగవా!” యనిరి. అంత చదువరియు వంతఁగూరి బెగ్గిలెను. అంటు నిక్కచ్చి కాకున్నను, గొలమున నట్టి తోలుతెగు లొక్కరి కున్న ముందెంతో కీడుగదా.

నేనును “అయ్యగారూ! మీకన్న వెజ్జమిన్న లెవరు? పిన్న నేనేమెఱుఁగుదును. మదినిల్కడతో మీరే యొక వెర

చెన్నఁదగు, నయినను నా మనవి – వెలిగోఁ దేవుళ్ళ దోలఁప వెలుఁగుల వేల్పును మించిన మందరి యెందును లేఁడని మీయట్టి పెద్దలే యందురు

నిచ్చలు నాతని పూజ మానరే మానిన నాడు సాపడరే. అట్టి కట్టుబాటున నాళ్ళు నెట్టు మీ కిట్టి బెదరేల? ఆలింపుఁడు ఏఁడు ప్రొద్దునాళ్ళ వరుస నరసవెల్లి వే వెలుఁగు వేలుపు గుడికి వలఁగొని, యా వేల్పుటడుగుజలకమే తోడాని కగా, నా జియ్యపేరే మందుగాఁ గొనుచు రాఁ గట్టడచేసిన, మనల నాతఁడు కావక పోఁ డంటిని. వాని తెమిపంట చూచుకొని, మందులవై పొరగ వచ్చునంటిని. ఇదియే నా నిరుకంటిని.”

నాయనా! బాగు! మంచిమాట పిన్ననుండియు గొనఁ దగినదే, యనుచు మా యమ్మ కట్టి కట్టడ చేసిరి. బెదరి యున్న యామెయు నేమి చేయఁదు? అందులకుఁ గడంగినది. నే నా వేలుపు మంతర మానుకొంటిని.

మూఁడు ప్రొద్దునాళ్లు లోలి నాగాముతేనిం గొలిచినది నా తల్లి. నాలవనాటికిం దెలవాఱుజామున, లెంక తోఁపాగా గుడికిం బయనమగు నా తల్లిని అమ్మా! యూఁగుమని నా యాస తొరకొలఁదిని జేదివ్వె వెలుఁగున నా బత్తురాలి మే నెగాదిగఁ జూచితిని. నిన్నటి సంజతఱికిని మున్నిటివలెనే యున్న బొల్లి పొడలు మఱి కానరాలేదు. అమ్మా! మచ్చలేవీ? యని నా కనులనే నేనమ్మక, మఱిఁ బరికించి, నాన్నగారూ! అని కేకవైచితిని. వేఁగు దెమ్మెరలకుం గట్టి కూరుకు పట్టినవారు త్రుళ్ళిపడి లేచి వచ్చిరి. నే నెదురు పఱవిడి ‘అమ్మ మచ్చలు, అమ్మ మచ్చలు’ అంటిని. వచ్చిరి, చూచిరి. ముగురము ముప్పిరిగాఁ గవుఁగిలించికొని యొండొరులం గన్నీళ్ళతోఁ

దడిపికొంటిమి. అవ్వాఁబుగుల జెప్ప గొప్ప మెప్పులఁ బలికి కొంచుఁ దనిసితిమి.

అంతఁదాఁక నుడుస్నిక తెలియని నాకా పనుల నాకేరిం దెనుఁగు పద్దెలతో నగ్గించు జతి పుట్టి "భాస్కరా" యను పంచు పెట్టుంచి, యొక చుక్క పరికూర్చి యచ్చుకొంటిని. అదియే నా తొలుక పలుకుల తొలికైఁత. అందలి ముందు మాటగా నా వ్రాసిన బంతులివి.

ఉ॥ సమ్మతి విన్మ, కైఁత గడిచాలని నాదగు విన్నపమ్ము మా
యమ్మ శరీర మెల్లెడ భయమ్మునుగొల్పుచుఁ దెల్లమచ్చ లా
క్షుమ్మడిఁ గ్రమ్ముకొఁగ, నయమో! హరి! యేమిదియంచు నామె డెం
దమ్మున బెంగగ్రమ్మఁ గనుదమ్ముల గాటుకనీళులోడ నే
నమ్మరో! కుంద నేలసి భయమ్మడఁ బాపుచు, నీ పవిత్ర నా
మమ్మును మందు చేసి పరమంబగు నీ పదపావనానుపా
నమ్మున నేడు భాస్కరదినమ్ములు సేవ యొనర్పఁ జేయు, వా
రమ్ములు మూటిలోన బళిరా! యిఁక నేమని చెప్ప, దేహముం
గ్రమ్మిన మచ్చ లద్భుతకరమ్ముగ మాయముగాఁగ నీవు గా
కిమ్మహి నార్తరక్షకు లిఁకెవ్వరటంచు మదిం దలచి, నే
నిమ్మగు బత్తితో నిరువదేడగు పద్దెములల్లి మాఘమా
సమ్మున, నొక్క భానుదివసమ్మున, నీ పదపద్మసన్నిధా
నమ్మున నుంచినాఁడ, భువనమ్ముల నెల్ల నిబద్ధమైన సా
త్యమ్ముగ నిల్చునంచును; దయామతిఁ గైకొని దీన నెట్టి దో
సమ్ములు దొర్లియున్న నని సైఁచెడి భారము నీదె సూ, ప్రణా
మమ్ములు గొమ్ము, ముత్తి సుగమమ్ముగ నిమ్ము, తొలంచివమ్ము పా
పమ్ములు హర్షవల్లి పురవాస! దినేశ! కృపాళు! భాస్కరా!

ఇమ్మూందు మాటలుగల చుక్కసరి గాని, యీ మఱు సాలున వ్రాసిన యీ వేల్పుతిరునేల గొప్ప సుద్దిగాని, రెండవ తూరి యచ్చునఁబడలేదు.

"భాస్కర నక్షత్రమాల" "అరసవల్లి క్షేత్ర మాహాత్మ్యము" అను నా పొత్తముల మఱల నచ్చొత్తింపఁబూను బత్తుల కిచ్చివేయుదును.

ఇట్లు
చదువరి యడియరి
ఈశ్వర సత్యనారాయణశర్మ

---

## మంత్రములు — వాని ఫలములు

రోగహరమంత్రములు:- 11-12-13-44-48-65
దుస్స్వప్నహరములు:- 41
ఆయుష్కరములు:- 28-33-35-36-39-43-44-45-55
ధనదములు:- 27-30-47-57
నేత్రరోగహరములు:- 35-44-45-52-53-54
ఉపప్లవవారకములు:- 16-21-22-32-50-55-65
శత్రుహరములు:- 36-37-39-40-49-51-54-56
అన్నదములు:- 27-41-48-56. వర్షదములు:- 50-58-60
ప్రజాప్రదములు:- 44
ముక్తిదములు:- 4-8-10-20-43
పాపహరములు:- } 6-9-10-15-16-18-19-24-26-31-
శుభప్రదములు:- } 34-44-46-48-49
జ్ఞానదములు:- 14-20-22-29-38-44-54-57-61-62-63
కామదములు:- 30-38-42-43-47-48-65



# మహాసౌరమంత్ర పాఠము

## సస్వరము, తెలుఁగుపద్య, ఆంగ్లగద్యానువాదములు

II I I II II
ఓమ్ ఉదుత్యం జాతవేదసందేవం వహాన్తి కేతవః దృశే విశ్వాయ సూర్యం॥1

గీ॥ ఇవె రవిగుఱ్ఱాలు లోక వీక్షించుకొఱకు
విశ్వవిఖ్యాతచరితుని, వెలుఁగు వాని
నఖిలవేదిని, సర్వనియంతయైన
వానిఁ జేర్చును పైకి నభంబునందు. 1

Behold these radiant rays (steeds) of the Sun, the All-famed, Self-effulgent, Omniscient, All-mighty Dictator that take Him high above so that all the worlds might perceive Him. 1

II I I II I
అప త్యే తాయవో యథా నక్షత్రా యన్త్యక్తుభిః।సూరాయ విశ్వచక్షసే॥ 2

గీ॥ సకలలోకము వెలిఁగింపఁజాలు ప్రొద్దు
రాకఁగన్గొని, యల్లదే రక్షకభట
గణము నారసి పాఱు దొంగల విధమున
రేలతో జాఱిపోవును రిక్కలగుమి. 2

The stellar groups along with nights are fleeing at the sight of the Rising Sun, the Illuminator of all worlds as thieves flee at the sight of police. 2

I ◉ I II II
అదృశ్రమస్య కేతనో విరశ్మయో జనా అను।భ్రాజంతో అగ్నయో యథా॥3

క॥ తెలివి నొసంగెడి యీ వే
వెలుఁగులదారి వెలుఁగుగములు, వెలిఁగెడి పెన్నిం
గలములవలె నోలిం గను
నిలఁబుట్టినవాని నెల్ల నివిగో, బళిరా!॥ 3

Look how the beams of His rays which bestow divine knowledge are, like huge burning fires, illuminating all the objects of the worlds. 3

II I I II
తరణిర్విశ్వదర్శతో జ్యోతిష్కృదసి సూర్య। విశ్వమాభాసి రోచనం॥ 4

చ॥ ఇతరులు దాఁటరాని తెరువిట్టె తరింతువు సూర్య! భక్తసం
తతిని రుజాదిశాపదల దాఁటఁగఁజేయుదు వీవె సూ; ముము
క్షుతతికి దర్శనీయుఁడవు; జ్యోతుల వెల్గఁగఁజేయు; దన్నిటన్
ద్యుతులను నింతువుగ భవమహోదధితారకనౌక, యోరవీ!

Thou, O Surya, journeyest along the path which none could traverse; Thou liftest Thy devotees from the abyss of sorrow and suffering caused by ills and ailments; to the seekers of deliverance Thou art dear to sight; Thou illuminest all the worlds (by Thee moon, stars and other bodies shine in the night); O Redeemer! Thou fillest all with Thy resplendent rays! 4

I II I I
ప్రత్యఙ్ దేవానాం విశః ప్రత్యఙ్ఙుదేషి మానుషాన్ । ప్రత్యఙ్విశ్వం స్వర్దృశే॥

గీ॥ ఆ మరుద్దేవతలు చూడ, నీ మనుజులు
చూడ, నా స్వర్గవాసులు చూడ, సూర్య!
తోఁచుచున్నాఁడు మాకె యెదురుగ, ననుచు
నెల్లరకుఁ దోఁచునట్లుదయింతు వెదుట. 5

As those Maruts perceive, as these mortals behold and as those yon celestial beings see, O Surya, Bhagavan! Thou risest in front as if Thou appearest exclusively for each. 5

II I ◉ I I I
యేనా పావక చక్షసా భురణ్యంతం జనా అను । త్వం వరుణ పశ్యసి॥ 6

గీ॥ అఖిలపావన! ఓ, యనిష్టాపనోది!
జనములను దాల్చి నీ లోకమును గ్రమముగ
వెల్గఁ జేయుదు, వేనీదు వెల్గుచేత
నట్టి నీ తేజ మాకు స్తుత్యము దినేశ! 6

O Thou All-purifier! Dispeller of all mishaps and evils! That light (Tejas) of Thine with which Thou illuminest all this world of living beings is worthy of our praise. 6

II I II I II
విద్యామేషి రజస్పృథ్వహా మిమానో అక్తుభిః । పశ్యంజన్మాని సూర్య॥ 7

గీ॥ పగళులను రేల నీవె యేర్పఱచు, చెల్ల
ప్రాణిజాతము మాఱుఁ గన్పడఁగఁ జేయు
చుంతొ విస్తీర్ణమగు నంతరిక్షలోక
మందుఁ గడు సంచరించుచునుందు సూర్య! 7

O Sun! Thou *journeyest* along the infinite vastness causing days and nights by Thy movement and illuminating all the animate world, 7

II II I II
సప్త త్వా హరితో రథే వహన్తి దేవ సూర్య । శోచిష్కేశం విచక్షణ॥ 8

గీ॥ వెల్గుచుంతట, నన్నిటి న్వెల్గఁ జేయు
ప్రొద్దుదేవర! యేడశ్వములును, గురులఁ
బోలు తేజులతో రథమున వసించు
నిన్ను గమ్యపదముఁ జేర్చుచున్న వౌర! 8

O Thou Self-effulgent! All illuminator! Thy seven steeds (seven kinds of beams) shining with lustrous hair take Thee seated in the chariot to Thy *journey's* end. 8

I I I I I
అయుక్త సప్తశుంధ్యువః సూరో రథస్య నప్త్యః। తాభిర్యాతి స్వయుక్తిభిః॥ 9

గీ॥ అఖిలపావనములుఁ, దామె యరదమునకుఁ
బూనునవి, దాని దిగఁబడ నీనివి యగు
నాఁడు గుఱ్ఱము లేడిటితోడ, సూర్యుఁ
డరుగుచున్నాఁడు పూజాగృహమున కతఁడె. 9

Behold! That Bhagavan Surya, the All-Inspirer, is arriving at His Sanctuaıy seated in His lustrous chariot which His seven holy, benevolent, willing mares strap themselves and do noı allow it to be depressed. 9

I II I
ఉద్వయం తమసస్పరి జ్యోతిష్పశ్యంత ఉత్తరం।

II II I
దేవం దేవత్రా సూర్యమగన్మ జ్యోతి రుత్తమమ్॥ 10

గీ॥ పాపరహితునిఁ దేజస్విఁ బ్రాగ్ర్యు, వేల్పు
లందు దానాదిగుణముల నడరు సూర్యుఁ
బొగడి, వేల్చి, యుపాసించి, పొందఁగలము
గాక, తద్దేవసాయుజ్యఘనఫలంబు. 10

May we who adore Him obtain the sublime fruition of His Sayujya (at-one-ment) by ever thinking of Him, by extolling Him, by offering oblations for Him and by surrendering everything unto Him, the Sinless, Lustrous, Foremost of the Benefactors in Gods, the Most-eminent, Supreme Being, Surya Bhagavan. 10

I I II
ఉద్యన్నద్య మిత్రమహా ఆరోహన్నుత్తరాం దివమ్।

I II
హృద్రోగం మమసూర్య హరిమాణం చ నాశయ॥ 11

గీ॥ సూర్య! సర్వానుకూల తేజోవిశిష్ట!
ఇపుడుదయమంది చక్కని మిన్నెక్కువాఁడ!
అంతరమ్ములు బాహ్యమ్ములైన నాదు
వ్యాధులం దొలఁగింపుము వడిగ, దేవ! 11

Thou O Surya, resplendent with all-favourable radiance! rising now and ascending the heaven straight, we pray Thee destroy all our maladies internal and external. 11

II II II
శుకేషు మే హరిమాణం రోపణాకాసు దధ్మసి।

II I I
అథోహారిద్రవేషు మే హరిమాణం నిదధ్మసి॥ 12

గీ॥ ఆకుపచ్చని నాదు చర్మామయమును
బలుకు పిట్టలయందు గోరువంకలందు
నట్టి పచ్చనివగు తాటిచెట్లులందుఁ
బెట్టుచున్నాము మము బాధపెట్టకుండ. 12

The green skin diseases of mine I place in parrots green, starlings green and palmyrahs green so that they may not torment me. 12

I II II I
ఉదగా దయమాదిత్యో విశ్వేన సహసా సహ ।

II I I
ద్విషన్తం మహ్యం గంధయన్మో అహం ద్విషతే రథం॥ 13

గీ॥ నాకుఁ గీడొనరించు దుర్గతుల నెల్లఁ
దనబలముచేత నదితిపుత్త్రుఁడితండె
యడఁచుచుదయించె; నిఁక నాకు హానిచేయు
వ్యాధికి బదులుసేఁత నాపనియె కాదు. 13

Quelling by His power all those maladies that harm me, this son of Aditi, Surya, is now rising. To avenge them is, therefore, not my concern. 13

I II II I
చిత్రం దేవానా ముదగాదనీకం చక్షుర్మిత్రస్య వరుణస్యాగ్నేః

II I I I I
ఆప్రాద్యావా పృథివీ అంతరిక్షం సూర్య ఆత్మా జగతస్తస్థుషశ్చ॥ 14

గీ॥ వెలుఁగు మొత్తమె రూపమై, వింతగాఁగ
జగముకన్నై, పొడమి తన జిగుల దివిని
భూనభంబుల నించెడి ప్రొద్దువేల్పు
యాస్థిరచరాత్మయు సకల హేతువౌను. 14

As an embodiment of all shining rays this marvellous optical sphere has arisen–Surya, pervading the heaven, the earth and the mid-region is the Soul of all that moves or stands still and the Cause of all. 14

II I II II
సూర్యో దేవీ ముషసం రోచమానాం మర్యో న యోషా మభ్యేతి పశ్చాత్ ।

II II I I I
యత్రా నరో దేవ యన్తో యుగాని వితన్వతే ప్రతి భద్రాయ భద్రమ్॥ 15

(1) గీ॥ ఎత్తఱి నరులు వేల్తు రభీష్టసిద్ధి
వలచి వేల్పులకై, యాప్రభాతకాంతఁ
దాలు సూర్యుండు పురుషుఁడు తరుణిని వలె
నట్టి శుభమయు నుత్తు శుభార్థినగుచు.

(i) This our Lord, Surya, like one attached to his fair beloved, is running after the most charming and bright Ushas when human beings offer oblations to their deities for fulfilment of their desires. I now praise that Love-Incarnate for the good of all.

(2) గీ॥ ఎత్తఱిని దున్ను పనిముట్టులెత్తి, యజ్ఞ
ధనముఁగూరుప గేస్తులు చనుదు రట్టి
వేఁకువ వొయ్యారి నొక కామి వెలఁదిని వలెఁ
దాలు శుభమయు నుత్తు భద్రములు కోరి. 15

(ii) Desiring all good I extol Him, the Love-Incarnate, who, like one attached to his beloved, follows the beautiful Ushas when householders desiring to procure sums for the worship of their deities start with ploughs and other implements of agriculture. 15

II I I II
భద్రా అశ్వా హరితః సూర్యస్య చిత్రాఽ ఏతగ్వాఽ అనుమాద్యాసః।

II I II II I
నమస్యన్తో దివఽ ఆపృష్ఠమస్థుః పరిద్యావా పృథివీ యన్తి సద్యః॥ 16

గీ॥ రసమును హరించునవియుఁ జిత్రములును శుభ
కరములున్ స్తుత్యములు వ్యాపకములునైన
ప్రొద్దు మెఱుఁగులు మాచేత మ్రొక్కఁబడుచు
గగనమునఁ బ్రాకు చెల్లెడఁ గమ్ము నవిగో. 16

(i) Possessing the nature of absorbing water, multi-coloured, benevolent, worthy of praise, carrying to the goal, these rays (steeds) of the sun, behold, have already reached the skies permeating heaven and earth.

అర్థాంతరము: గీ॥ పఱచునవి పచ్చనివియు శుభప్రదములుఁ
బొగడఁదగినవియైన యాప్రొద్దుతేజు
లవిగో, మామ్రొక్కులంది మిన్నట్టె చేరి
తిరుగుచున్నవి యఱలేక దివిని భువిని. 16

(ii) Green, shooting, benevolent and laudable steeds (rays) of the Sun which deserve praise, have reached the skies and are marching forward receiving our salutations.

తత్సూర్యస్య దేవత్వం తన్మహిత్వం మధ్యాకర్తోర్వితతం సంజభార ।
యదేదయుక్త హరితస్సధస్థాదాద్రాత్రీ వాసస్తనుతే సిమస్మై॥ 17

చ॥ అవుర! సగంబునందె పనులాఁపును లోకము, స్వీయదీప్తులన్
సవితృఁడు లోఁగొనంగ; నదె సౌరవిభుత్వమునున్మహత్వ; మీ
యవసరమందు యానహరిదశ్వములన్ సడలించు; నప్డె రే
యి వెసను జిమ్మచీఁకటుల నెల్లెడ నించును జోటు చిక్కుటన్.

Indeed, the world suspends in the middle all the work the moment the Lord of the Day withdraws His rays. This reveals His supremacy and sovereignty. Seeing Him unleash His steeds the watchful night (having secured foothold) spreads and confuses the world with extreme darkness. 17

తన్మిత్రస్య వరుణస్యాభిచక్షే సూర్యో రూపం కృణుతే ద్యోరుపస్థే
అనన్త మన్యద్రుశదస్యపాజః కృష్ణమన్యద్ధరితః సంభరన్తి॥ 18

గీ॥ జగదభిముఖంబుగాఁదోఁచి చదల నడుమ
నీజగంబును జూపు తేజమ్ము సూర్యుఁ;
డతని మెఱుఁగులె బలుమైల నడఁప వలఁతు
లవె యుడఁగి కాఱుచీఁకటి నడరఁజేయు. 18

Appearing in front of this world this our Lord, Surya, sheds forth from the skies His light which illumines all, chasing darkness. And lo! when he withdraws, the night spreads its black wings again. 18

అద్యా దేవా ఉదితా సూర్యస్య నిరంహసః పిపృతా నిరవద్యాత్ ।
తన్నో మిత్రో వరుణో మామహంతా మదితిస్సింధుః పృథివీ ఉత ద్యౌః॥19

గీ॥ వెలుఁగు ప్రొద్దు మెఱుఁగులార! వేవెలుంగు
పొడుచు నివ్వేళ మా కొలలడఁపరయ్య!
మమ్ము మిత్రావరుణులును తమ్మదితిద్యు
లోకసింధులు మన్నింతుగాక తమిని. 19

O Ye shining rays of the Sun! who art spreading hither and thither, save us now at this time of the rise of Thy Lord by annihilating our dark sins May Mitra, Varuna and Aditi, Sindhu Earth and Dyuloka also grant us this our prayer. 19

ఇంద్రం మిత్రం వరుణమగ్నిమాహు రథో దివ్యస్స సుపర్ణో గరుత్మాన్
ఏకం సద్విప్రా బహుధా వదంత్యగ్నిం యమం మాతరిశ్వాన మాహుః॥ 20

సీ॥ పరతత్త్వవేత్త లైశ్వర్యశోభి మహేంద్రుఁ
గా నందు; రహరభిమానియైన
మిత్రుఁగా నంద్రు; యామిన్యభిమానియౌ
వరుణునిగా నంద్రు; వ్యాపకస్వ
భావుఁడౌ నగ్నిఁగా; బాగుగా నెగురు మ
రుల్లోకపతి గరుడునిఁగాఁగ;

వృష్ట్యాదికారణ విద్యుదగ్నినిఁగా; ని
యంతయై యొప్పెడి యమునిగాఁగ;
నంతరిక్షచరుండగు ననిలుఁగాఁగ;
ఇట్టు లారొక్క సూర్యునే యెన్నొ గతులఁ
బలికి సార్వాత్మ్యమున్నిల్పి, బ్రహ్మమునకు
భిన్నుఁడీతఁడు కాఁడని యెన్నుచుండ్రు. 20

That One Reality the sages speak of in many ways. They speak of Him as 'Mahendra', the Lord of Splendour, as 'Mitra', the Lord of Ahas; as 'Varuna' the favourite of Yamini; as 'Agni' with spreading nature; as 'Garuda' of fine wings; as 'Lightning' the cause of rain etc., as 'Yama' the Dictator and as 'Anila' the wanderer of skies. They say of Bhagavan Surya as the One not different from the Supreme Brahman attributing Omnipresence. 20

కృష్ణం నియానం హరయస్సుపర్ణాః అపో వసానా దివముత్పతన్తి
తఽ ఆవ వృత్రన్త్సదనాదృతస్యాదిద్ఘృతేన పృథివీ వ్యుద్యతే। 21

గీ॥ జలముఁబీల్చెడి రవి జిగు ల్చదలి కెగురు,
నియతిఁజను నీలిమబ్బుల నీరు నించు
చవియె రవిమండలావృత్తినందు నవ్వ
డెడము లేక యె యీ భూమి తడుపఁబడును. 21

The vapourising rays of the Sun shoot to the skies, move in order, fill the dark clouds with water; when these return from the orbit of the Sun all the earth becomes drenched without delay. 21

I I II I
హంస శ్శుచిష ద్వసు రంతరిక్షస ద్ధోతా వేదిష దతిథిర్దురోణసత్

I I II I I
నృషద్వరసదృతస ద్వ్యోమస దబ్జా గోజా ఋతజా అద్రిజా ఋతమ్॥ 22

సీ॥ గమనస్వభావుఁడై కాయు నీ సూర్యుఁడే
తనుకునట్టి ద్యులోకమున వసించు;
వింట సమీరుఁడౌ; వేల్పులగు సురల నా
హ్వానించు; మఱి వైదికాగ్ని యగును;
అతిథివలెం బూజ్యుఁడౌను; పాకాదిసా
ధనలౌకికాగ్నియై తనరుచుండు;
చైతన్యరూపియై జనములలో నుండు;
సద్బింబమున నుండు; సత్యమందు
నుండు; నభమున మెఱుపౌచు, నుదకములను
బడబయై యుండు; రశ్ములఁ బ్రబలియుండు;
ఆతఁ డింద్రాదులటు చాటునందు నిలఁడు;
ప్రాగ్గిరిని దోఁచు బ్రహ్మతత్త్వంబతండె. 22

This moving Sabiour, Surya, resides in the glowing Dyuloka; He bcomes Vayu in the sky; He invites deities to receive oblations; He becomes the Vedic Fire; like a Guest He becomes worshipful; He becomes the ordinary household fire for cooking and other purposes; He resides in men in the form of vital energy; as an Image of Reality He resides in noblest places; He dwells in Eternal Truth; He becomes Lightning in the sky and submarine fire in water; He dominates all that radiates; unlike Indra and others He doth not conceal Himself; He (the crux and consummation of all knowledge) alone is the Supreme Brahman presenting Himself in the East. 22

II I I
యత్త్వా సూర్య స్వర్భాను స్తమసావిధ్యదాసురః

II II I
అక్షేత్రవిద్యథా ముగ్ధో భువనాన్యదీధయుః ॥ 23

గీ॥ ఓయి! సూర్యుఁడ! యసుర రాహువు తమస్సు
చేత నిన్నుఁగప్పినప్పు డీ చేతనులటు
లెల్ల లోకాలు స్వస్థాన మెఱుఁగ లేని
యంతమౌఢ్యంబు నొందుచు నగపడవె? 23

O Thou, **Surya**, when the demon Rahu with his shade eclipses Thee, like animate beings all the worlds become so distressed and confused as not to know their places. 23

II II I
యదద్య సూర్య బ్రవోనాగా ఉద్యన్మిత్రాయ వరుణాయ సత్యమ్ ।

II I I II I
వయం దేవత్రాదితే స్యామ తవ ప్రియాసో అర్యమన్ గృణంతః ॥ 24

గీ॥ ఉదయసూర్యుఁడ! నిను మ్రొక్కు సదనమున మము
ననఘులని మిత్రునకు వరుణునకు ననినఁ
దప్పకల్లాదు మో వరదాత! నిన్నుఁ
బొగడుచుం బ్రేమపాత్రుల మగుదుమయ్య! 24

O Rising Sun! While we prostrate to Thee, if Thou shouldst commend us to Mitra and Varuna as pure and sinless we really become so, O Boon-giver! by praising Thee we become dear. 24

II I I I
ఉత్సూర్యో బృహదర్చీంష్యశ్రేత్ పురు విశ్వా జనిమ మానుషాణామ్ ।

I I II I I
సమో దివా దదృశే రోచమానః క్రత్వా కృతః సుకృతః కర్తృభిర్భూత్ ॥ 25

చ॥ జనములఁగూర్చి సూర్యుఁడె విశాలబహుప్రభలిట్టి పైకిఁజే
ర్చు; నతఁడెకన్పడున్ బవలురూపున నొక్కఁడుగాఁగ; బ్రహ్మచే
త నతఁడె సర్వకర్తృతకుఁ దానకమయ్యె; నతండె సంస్తుతుల్
పొనరుచు మా నుతుల్గొనుచు మున్నిటికంటెను
దీండ్రదాల్చుతన్. 25

For the sake of human beings the Lord Surya, sheds His vast and innumerable rays; in the form of Day He appears as Nondual Being; from Brahma He derives all agency. Exalted shall He be still more by our adoration and supplication. 25

II I II II II
స సూర్య ప్రతి పురో న ఉద్గా ఏభిస్స్తోమేభిరేతశేభిరేవైః ॥

II I II II
ప్ర నో మిత్రాయ వరుణాయ వోచోఽనాగసో అర్యమ్ణే అగ్నయే చ ॥ 26

సీ॥ సుప్రసిద్ధుఁడ! సూర్యుఁడా! స్తుత్యజవన
శబలసప్తులతో సమక్షమునఁదోఁచి
యనఘులని మిత్రవరుణార్యమాగ్నులకును
నుడువుమా మమ్ముఁగూర్చి మానుతులు గొనుచు.26

O Thou Most Eminent! Surya! appearing before us with Thy praiseworthy and swift steeds (rays) of variegated colours, we entreat Thee commend us to Mitra, Varuna, Aryama and Agni as sinless. 26

